# అథ ఋగ్వేదోక్తమ్ - దేవీసూక్తమ్

వినియోగః

ఓం అహమిత్యష్టర్చస్య సూక్తస్య వాగామ్భృణీ ఋషిః, సచ్చిత్సుఖాత్మకః సర్వగతః పరమాత్మా దేవతా, ద్వితీయాయ ఋచో జగతీ, శిష్టానాం త్రిష్టుప్ ఛందః, దేవీమాహాత్మ్యపాఠే వినియోగః ॥

ధ్యానమ్

ఓం సింహస్థా శశిశేఖరా మరకతప్రఖ్యైశ్చతుర్భిర్భుజైః
శంఖం చక్రధనుఃశరాంశ్చ దధతీ నేత్రైస్త్రిభిః శోభితా ।
ఆముక్తాంగదహారకంకణరణత్కాంచీరణన్నూపురా
దుర్గా దుర్గతిహారిణీ భవతు నో రత్నోల్లసత్కుండలా ॥

---

వినియోగము : ఓమ్ అహం అనెడు ఎనిమిది ఋచలతో కూడిన సూక్తమునకు, వాగాంభృణీ ఋషి, సత్‌చిత్ సుఖాత్మకము, సర్వగతము ఐన పరమాత్ముడు దేవత, ద్వితీయ ఋక్కునకు జగతీ ఛందస్సు, శిష్టులకు త్రిష్టుప్ ఛందస్సు, దేవీమాహాత్మ్యము పారాయణమునకు దీని వినియోగము చెప్పబడినది.

**ధ్యానము** : సింహవాహనము మీద విరాజిల్లుచున్నది, మస్తకముపై నెలవంకను ధరించినది, మరకతమణివంటి వన్నెతో మెరయుచున్నది, తన నాలుగుచేతులలో శంఖమును, చక్రమును, ధనుస్సును, బాణములను ధరించినది. మూడు కన్నులతో ఒప్పారుచున్నది. వేరు వేరు అంగములయందు ముత్యపు దండకడియములు, హారములు, కంకణములు, నడుమునకు శోభిల్లుచున్న వడ్డాణము, ఘల్లుఘల్లు మంటున్న కాలి అందెలు మున్నగు ఆభరణములతో అలంకరింపబడి యున్నది. జిగేలుమంటు తళుకులీనుచున్న రత్నములు పొదిగిన కుండలములను కలిగినట్టి భగవతి దుర్గామాత మా దుర్గతిని దూరమొనర్చుగాక!యని నమస్కరించెదను.

(అంభృణుడను మహర్షికి వాక్ అను పేరుగల కూతురు ఉండెను. ఆమె గొప్ప బ్రహ్మజ్ఞానసంపన్నురాలు. ఆమె దేవితో అభిన్నత్వమును - ఐక్యతను పొందెను. అట్టి 'వాక్' అను ఆమె ముఖమునుండి వెలువడిన ఋక్కులే ఇవి)

## అథ దేవీసూక్తమ్

ఓం అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః ।
అహం మిత్రావరుణోభా బిభర్మ్యహమింద్రాగ్నీ అహమశ్వినోభా । 1

అహం సోమమాహనసం బిభర్మ్యహం
త్వష్టారముత పూషణం భగమ్ ।
అహం దధామి ద్రవిణం హవిష్మతే
సుప్రావ్యే యజమానాయ సున్వతే । 2

అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం
చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్ ।

---

తా॥ నేను సచ్చిదానందమయి, సర్వాత్మయగు దేవిని. అట్టి నేనే ఏకాదశ రుద్రులుగా, అష్టవసువులుగా, ద్వాదశ ఆదిత్యులుగా మరియు విశ్వేదేవగణముల రూపమున విశ్వమునందు సంచరించుచు జగత్తును రక్షించుదును. సూర్యుడు, వరుణుడు అను ఇరువురను, ఇంద్రుడు, అగ్నిని మరియు అశ్వినీ కుమారులు అను ఇద్దరేసి జంటదేవతలను ధరించుదానను నేనే. (1)

తా॥ శత్రువులను నశింపచేయునట్టి ఆకాశచారుడగు సోముని, ప్రజాపతియగు త్వష్టను, భగుడు, పూషణులను దేవతలను నేనే ధరించెదను. యజ్ఞమునందు చక్కని శ్రేష్ఠమైన హవిస్సులను అందించి దేవతలను తృప్తిపరచునది నేనే. అట్లే సోమరసముద్వారా దేవతలను సంతృప్తిచేయునట్టి యజమానికి తగిన ఉత్తమమమైన యజ్ఞఫలమును, ఇహమున, పరమున ధనమును, స్వర్గమును నేనే ప్రసాదించెదను. (2)

తా॥ నేను ఈ జగత్తునకు అంతటికినీ మహారాజ్ఞిని, అధీశ్వరిని (జగదీశ్వరిని). నన్ను ఉపాసించెడు సాధకులకు ధనమును అందజేయుదును. సాక్షాత్కరింపజేసుకొనుటకు యోగ్యమైన పరబ్రహ్మను నాకు అభిన్నముగా తెలియుదును. పూజింపతగిన దేవతలలో ప్రధానమైనదానను నేను.

తాం మా దేవా వ్యదధుః పురుత్రా

భూరిస్థాత్రాం భూర్యావేశయంతీమ్ । 3

మయా సో అన్నమత్తి యో విపశ్యతి యః

ప్రాణితి య ఈం శృణోత్యుక్తమ్ ।

అమంతవో మాం త ఉప క్షియంతి శ్రుధి

శ్రుత శ్రద్ధివం తే వదామి । 4

అహమేవ స్వయమిదం వదామి జుష్టం

దేవేభి రుత మానుషేభిః ।

యం కామయే తం తముగ్రం కృణోమి

తం బ్రహ్మాణం త మృషిం తం సుమేధామ్ । 5

---

ప్రపంచరూపముతో అనేకానేక భావాలలో వ్యాపించియుందును. ప్రాణులన్నింటిలో నా ప్రవేశము ఉండును. పలుచోట్లలో ఉండునట్టి దేవతలందరును ఎచ్చటెచ్చట, ఏమేమి చేయుదురో, అదంతయును నాకొరకే వారందరును చేయుదురు. (3)

తా॥ అన్నమును తినువాడు, నా శక్తివల్లనే తినగలడు. (ఏలనన, నేనే భోక్తృశక్తిని). ఇదేవిధముగ చూచువాడు (చూచేశక్తి), ఊపిరిపీల్చువాడు (శ్వాసశక్తి), చెప్పిన మరియు వినిపించిన మాటను వినువాడు (శ్రవణశక్తి), నా సహాయమువల్లనే పై కర్మలను అన్నింటిని చేయుటకు సమర్థుడగును. నన్ను ఈ ప్రకారముగా తెలియనివాడు, తెలిసికొనలేకపోవుటవలన (తెలియలేకపోవుటవలన) అతడు దీనదశను పొందును. కావున, ఓ బహుశ్రుతా! శ్రద్ధతో పొందగలిగిన బ్రహ్మతత్త్వమును నేను, నీకు ఉపదేశించెదను, వినుము. (4) నేను స్వయముగా దేవతలద్వారా, మానవులద్వారా సేవింపబడు, దుర్లభమైన ఈ తత్త్వమును వర్ణించి చెప్పెదను వినుము. నేను ఏయే పురుషుని రక్షింపకోరుదునో, ఆయా వ్యక్తులను అందరికంటే ఎక్కువ శక్తిశాలురుగా రూపొందింతును. అంతేకాదు, వారినే సృష్టికర్తయగు బ్రహ్మగా, పరోక్షజ్ఞానసంపన్నుడగు ఋషిగా, ఉత్తమ మేధాశక్తి సంపన్నునిగా తీర్చిదిద్దెను. (5)

అహం రుద్రాయ ధనురా తనోమి బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ ।
అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృథివీ ఆ వివేశ । 6
అహం సువే పితరమస్య మూర్ధన్మమ
యోనిరప్స్వంతః సముద్రే ।
తతో వి తిష్ఠే భువనాను విశ్వో-
తామూం ద్యాం వర్ష్మణోప స్పృశామి । 7
అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వా ।
పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సంబభూవ । 8

॥ ఇతి ఋగ్వేదోక్తం – దేవీసూక్తమ్ ॥

☆☆☆

తా॥ బ్రహ్మద్వేషులు, హింసావృత్తి గలిగినవారలు అగు అసురులను వధించుటకొరకు సాధనమగు ధనువును రుద్రునకు నిర్మించి ఇచ్చినదానను నేనే. (ఎక్కుపెట్టునది నేనే). అట్లే శరణాగతజనులను రక్షించుటకై వారి శత్రువులతో నేను యుద్ధమును కూడ చేసెదను. భూమి మరియు ఆకాశముల నడుమ అంతటా అంతర్యామిగా నేనే వ్యాపించియుందును. (6)

తా॥ ఈ జగత్తునకంతటికి తండ్రిగానున్న ఆకాశమును సర్వమునకు అధిష్ఠానస్వరూపమైన పరమాత్మకు పైన సృష్టించెదను. సముద్రము (అనగా – (సకలభూతములకు ఉత్పత్తిస్థానమగు పరమాత్మ)లో, మరియు జలము (అనగా – బుద్ధియొక్క వ్యాపకవృత్తుల)లో నా కారణము (అనగా – కారణస్వరూపమగు చైతన్యబ్రహ్మము) యొక్క స్థితి కలదు; కావున, నేను సమస్త భువనములలో వ్యాపించియుందును. నా జ్యోతిస్స్వరూపమగు శరీరముతో ఈ స్వర్గలోకమును (ద్యులోకమును) కూడా స్పృశించెదను. (7)

తా॥ కారణరూపముతో నేను సమస్త విశ్వరచనను ప్రారంభించినప్పుడు ఇతరుల ప్రేరణ లేకుండానే స్వయముగా వాయువువలె సంచరించెదను. స్వేచ్ఛగనే కర్మయందు ప్రవృత్తమయ్యెదను. నేను భూమి, ఆకాశములకు రెండింటికినీ అతీతముగ ఉన్నాను. నా మహిమచేతనే నేను ఇంతటిదాననై ఈవిధముగ ఇమిడియున్నాను. (8)

*॥ ఇది ఋగ్వేదోక్తమగు దేవీసూక్తము సమాప్తము ॥*

☆☆☆